త్యజించి యథార్థమైన మాతృదేశాభిమానమును బూని దేశస్వాతంత్ర్యప్రాప్తికై పాటుపడవలసి యుందురు.

సకలపక్ష సమావేశారంభమునందు సేనుగుప్తగారు, అన్సారిగారు, మోతిలాలుగారు చేసిన ప్రసంగము లీమార్గమునే యవలంబించినవి. అలీసోదరులు చేయుచున్న హడావడి మాత్రము సంభ్రమమును గలుగ జేయుచున్నది. మహమ్మదీయమతము పేరట నేమేమియో ప్రగల్భములను గొట్టుచున్నారు. కత్తులు, యుద్ధములు మాటిమాటికి ఎగిరిపోవుచున్నవి. గాంధి మహాత్ము డుపదేశించిన హిందూమహమ్మదీయ సంయోగము, అహింసాతత్త్వము మూలఁబడినవి. మహమ్మదీయప్రాభవము, దౌర్జన్యము సర్వత్ర ప్రత్యక్షమగుచున్నవి. అలీసోదరుల ప్రగల్భములు హిందువులకే కాక మహమ్మదీయులకును నసహ్యమును గలుగజేయుచున్నవి. హిందూదేశసౌభాగ్యమును దేశలక్ష్యముతో జూచుట ధర్మముకాని మహమ్మదీయ ప్రపంచలక్ష్యముతో జూచుట సమంజసముగాదు. అలీసోదరు లెంతపెద్ద దుందుభులను ప్రయోగించినను హిందువులు మాత్రము ప్రశాంతమనస్కులై హిందూదేశమును, ప్రపంచశాంతిని నుద్ధరించుట ధర్మము. ప్రజ్ఞావంతులైన మోతిలాలునెహ్రూ అన్సారిగారల యాజమాన్యము క్రింద కాంగ్రెసు మహాసభయును, సకలపక్ష సమావేశమును స్వధర్మనిర్వాహణమును జేయుటకు కాళికాదేవి ప్రసన్నురాలగునని నమ్ముచున్నాము. భారతీయులందరును లబ్ధావకాశములను సద్వినియోగము చేయుదురుగాత!

*  *  *  *

## పండిత మోతిలాలు నెహ్రూ గారు

శ్రీయుత మోతిలాలునెహ్రూగారికి కలకత్తా నగరరాజము సమర్పించిన సుస్వాగత మపూర్వముగ నున్నది. ఏ సమ్రాట్టునకుగాని, రాజప్రతినిధికి గాని, నాయకునకు గాని ఇట్టియపూర్వమైన స్వాగతంబును కలకత్తానగర మొసంగియుండలేదు. ముప్పదినాలుగు శ్వేతహయములు గట్టిన రథము, జాతీయపతాకములు, జాతీయరక్షకభటులు, స్వాగతతోరణములు, స్వాగత జయఘోషములు, అపార ప్రజానివహములు, పుష్పవర్షములు, ప్రజలకు మోతిలాలుగారిపట్ల గల పరమ భక్తివిశ్వాసములకు నిదర్శనములు. మోతిలాలుగారికి ప్రజలు చూపిన భక్తి ప్రజా హృదయమునం దుప్పొంగుచున్న స్వాతంత్ర్యోత్సాహమునకు నిదర్శనముగ నున్నది. నెహ్రూరిపోర్టు మోతిలాలుగారి ప్రతిభను విస్తరింపజేసినది. మోతిలాలుగారి బుద్ధికుశలత నెహ్రూరిపోర్టునందును, వారి వాదప్రతివాదములందును విశదమగుచున్నది. వివిధ రాజకీయ పక్షములను, హిందువులను, మహమ్మదీయులను నేకముచేయగల రాజ్యాంగవిధానము మోతిలాలుగారి ప్రతిభను విస్తరింపజేసినది. కలకత్తా కాంగ్రెసునకు నివేదికను సిద్ధముచేసిన పండిత మోతిలాలు నెహ్రూగా రధ్యక్షులుగ నుండుటయును శుభచిహ్నముగ నున్నది. ఒకవైపున నిరంకుశవర్గము, సైమనుకమిషను, స్వప్రయోజన పరాయణులు దేశమును సంక్షోభమయము చేయుటకు విశ్వప్రయత్నములను జేయుచున్నారు. ఒకవైపున సర్వపక్ష సమావేశము శాంతిని, సంయోగమును సమకూర్చుటకు విశ్వప్రయత్నములను జేయుచున్నది. సర్వపక్ష సమావేశమునకు

సూత్రధారులైన పండిత మోతిలాలు నెహ్రూ గారి ప్రయత్నములను సఫలము చేయుటకు స్వాభిమానమును విడిచి సకలపక్షముల వారును త్రికరణశుద్ధిగ పాటుపడుటకు భగవంతు డనుగ్రహించుటకు దేశమంతయును వేడుట సహజము. అపూర్వమైన సర్వపక్ష సమావేశమునకును, కలకత్తా కాంగ్రెసునకును సమాప్యఫలము పరమేశ్వరుడు ప్రసాదించుగాత!

*　　*　　*　　*

రాజా రామా రాయణింగారు

శ్రీ పానుగల్లు రాజా రామా రాయణింగారి ఆకస్మికమరణము వారి కుటుంబమునకే కాక, ఆంధ్ర దేశమునకును, చెన్న రాష్ట్రమునకును అపారమైన నష్టమును గలుగజేసినది. సామాన్యకుటుంబమునందు జనించినను రామారాయణింగారు స్వయంసహాయమువలన మహోన్నతస్థితి నధిష్ఠింప గలిగిరి. విద్యోపార్జనము చేసి ఎమ్. ఏ. పరీక్షయందు త్తీర్ణులై సంస్కృతాంధ్రాంగ్లములందు మంచి పాండిత్యమును గడించిరి. లక్షల కొలఁదిగ వసతుల నార్జించి సుస్థిరముగ రాజాబిరుదము నార్జించిరి. ఆరేండ్లు ప్రధానమంత్రిత్వమును వహించి చెన్నరాష్ట్ర రాజ్యాంగముల స్వహస్తగతముచేసికొన గలిగిరి. మంత్రిపదవి లేకపోయినను మంత్రులను, నిరంకుశవర్గమును వశపరచుకొని రాజ్యాంగములను వశపరచుకొనగలిగిరి. రామారాయణింగారి ఆంధ్రభాషాభిమానము, ఆంధ్రదేశాభిమానము, స్వపక్షాభిమానము, స్వాతంత్ర్య ప్రియత్వము వారి శత్రువులకును, మిత్రులకును వారిమీద గౌరవమును గలుగజేసినవి. వారి నాశ్రయించి నమ్మినవారికి వారు బ్రాహ్మణబ్రాహ్మణేతరభేదము లేక ఉపకారమును జేయుచుండిరి. నిరంకుశవర్గమునకును రామారాయణింగారు పట్టుకొమ్మయై రక్షకులుగ నుండిరి. రాజ్యాంగతంత్రమునందును, సువ్యోగునందును వారికి గల వివేచనశక్తిని వారు స్వవిషయమునందును, స్వపక్ష ప్రయోజనము



కీ. శే. సర్ పానుగంటి రామారాయణింగారు,
కె. సి. ఐ. యి., యం. యల్. సి.,

నందును వలె దేశ ప్రయోజనమునందును వినియోగించగలిగి ప్రజాగౌరవమునకు పాత్రులైరి. ఆయుర్వేద వైద్య విషయమునను, దేశభాషలవిషయమునను, ఆంధ్రవిశ్వవిద్యాలయ విషయమునను, ధర్మాదాయ దేవాదాయ విషయమునను వారు చూపిన పట్టుదల వాద ప్రతివాదములకు గారణమైనను వారి గాఢాభిమానమునకును, దూరదృష్టికిని నిదర్శనముగనున్నది. పరమేశ్వరుడు వారి యాత్మకును వారి కుటుంబమునకును శాంతిని ప్రసాదించుగాత!

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, Thambu Chetty St., Madras